## ఏలం ప్రకటన

ఏకాంబరకుప్పం పాస్ బ్రోకరు S. M. A. సోమసుందర మొదలియార్ వద్ద 1951-వ సంవత్సరము ఆగస్టు, డిశంబరు, 1952 వ సంవత్సరము జనవరి, ఫిబ్రవరి నెలలలో ఏలం వేయ్యాగుడా కనిన ప్రకారము మరువపెట్టి యుండు నగలను 1953-వ సంవత్సరము ఏప్రిల్ నెల 2-వ తేది గురువారం పగలు 10 గంటలకు ఏకాంబరకుప్పం, పెద్ద వీధి, 1/81 వ నెంబరు ఇంటిలో బహిరంగముగా ఏలము వేయబడును. ఏ జి సోమసుందర మొదలియార్ ఏకాంబరకుప్పం, అప్రూవ్ అక్షనర్.

## ప్రకటన

కైకలూరు పంచాయితికి చెందిన సంతలలో ఫీజులను వసూలు చేసుకు నే హక్కులు 21—3—1953-వ తేది శనివారము పగలు 2 గంటలు లగాయతు పంచాయతి ఆఫీసు భవనము వద్ద బహిరంగ వేలములో లీజు చేయబడును.

పాట ధరావత్తు:

రు. 25/- రోజువారి సంత.

రు 50/- „ పశువుల సంత.

రు 100/- „ కూరల సంత.

పాట షరతులను ఆఫీసులో తెలుసుకొనవచ్చును.

వేంపాటి వెంకటేశ్వర రావు

కైకలూరు } పంచాయతి
6-3-1953 } ప్రెసిడెంటు.





## కృష్ణ ఆనకట్టకు రెగ్యులేటర్ రోడ్ బ్రిడ్జి

### ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గానికి అభ్యర్థన

విజయవాడ, మార్చి 9: కృష్ణ ఆనకట్ట ప్రమాద పరిశీలక సంఘం వారు సూచించినట్లు కృష్ణానదికి రెగ్యులేటర్ బ్రిడ్జి రోడ్ నిర్మాణానికి రాష్ట్ర ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకు రావలసిందిగా ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గాన్ని అభ్యర్థించుతూ నిన్న ఇక్కడ రెడ్డిపల్లి సూర్యనారాయణ గారి అధ్యక్షతన జరిగిన సమావేశంలో ఒక తీర్మానం చేశారు.

వరదలు వచ్చే కాలానికి ముందుగానే కృష్ణ ఆనకట్ట మరమ్మతులు పూర్తయ్యేటందుకు వీలుగా పబ్లిక్ వర్క్సు శాఖవారికి ఆ విషయంలో సహాయపడమని కృష్ణాలో యున్న చెందిన కాంగ్రెసు సేవకులకు విజ్ఞప్తి చేస్తూ మరొక తీర్మానం చేశారు. ఇటీవల నిలిపి వేయబడిన విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమాలను తిరిగి ప్రారంభించడం ద్వారా ఆ శాఖలో ఉద్యోగాలు పోయిన వారందరికి తిరిగి ఉద్యోగాలు ఏర్పాటు చేయమని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానం చేశారు. పి. టి. ఐ.

## కృష్ణాజిల్లా గ్రామాభ్యుదయ సంఘసమావేశం

నూజవీడు, మార్చి 8: కృష్ణాజిల్లా అక్కిరెడ్డి గూడెం గ్రామంలో రెవిన్యూశాఖవారు లోగడ ప్రారంభించిన బావి పనిని ఈసంఘం యాజమాన్యాన పూర్తి చేయించాలనీ, శోభనాద్రిపురం హరిజన వాడలోని బావి నిర్మాణం ఖర్చులను ప్రభుత్వమే పూర్తిగా భరించే షరతుమీద దానిని పూర్తి చేయించాలనీ, క్రిందటి నెల 28 వ తేదీన కృష్ణాజిల్లా కలెక్టరు అధ్యక్షతన జరిగిన సమావేశంలో కృష్ణాజిల్లా గ్రామాభ్యుదయ సంఘ సమావేశంలో కొన్ని తీర్మానాలు చేశారు. శ్రీయుతులు గోపరాజు రామచంద్రరావు, శ్రీమతి ఎర్నేని దమయంతీదేవి, పూటుకూరు నరసింహారావు ప్రభృతులు సమావేశంలో పాల్గొన్నారు.

ఇంతవరకు ఈ సంఘం ఆధ్వర్యాన జరిగిన కార్యక్రమాలను గురించి గ్రామాభ్యుదయ శాఖాధికారి పి. సత్యనారాయణగారు సమావేశంలో ఒక నివేదిక సమర్పించారు. ఈ సందర్భంలో నూజవీడు తాలూకా పశు, వ్యవసాయ వస్తు ప్రదర్శనలు కూడా జరిగినవి.

ఈ సంఘ సమావేశం యే ఫిర్కాలో జరిగితే ఆ ఫిర్కాకు సంబంధించిన విషయాలనే చర్చించాలని లోగడ యీ సంఘం వారు నిర్ణయించారు. ఇప్పుడా తీర్మానాన్ని సవరించి సమావేశం ఏ ఫిర్కాలో జరిగినా వివిధ ఫిర్కాలకు సంబంధించిన అభివృద్ధి కార్యక్రమాలను గురించి చర్చించాలని కూడా తీర్మానించారు. (స్వ. వి.)

## ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ వార్షికోత్సవం

కొవ్వూరు, మార్చి 10: ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠం 21 వ వార్షికోత్సవం యీ నెల 7, 8, తేదీల్లో శ్రీ నండూరి బంగారయ్యగారి అధ్యక్షతన జరిగినది. పూర్వ విద్యార్థి సంఘ సమావేశంకూడ యీ సందర్భంలో జరిగినది.

మొదటిరోజున జరిగిన సభలో ప్రధానాచార్యులు శ్రీ అప్పారావు గారు నివేదిక చదివారు. పిదప అధ్యక్షులు సంస్కృత విద్యాభ్యాస ఆవశ్యకతను గురించి ప్రసంగించారు. విద్యాపీఠ స్థాపకులు కీ. శే. శ్రీ తిల్లా ప్రగడ సూర్యనారాయణరావుగారి సేవను వివరించారు. పిదప తంగిరాల రామసోమయాజులు, నాదెళ్ల వెంకట్రావు, కందుకూరి వీరబసవరాజు, హరి సర్వేశ్వరశర్మ, ప్రభృతులు ప్రసంగించారు. పిదప సంస్కృత పాఠశాల విద్యార్థులు శ్రీ కుందుర్తి వేంకటేశ్వర్లు శర్మగారి ... అనే నాటకం ప్రదర్శించారు.

రెండవరోజున విద్యార్థులగోష్ఠి జరిగినది. పూర్వవిద్యార్థుల పరిచయాసంచిక గౌతమిలిఖిత మాసపత్రిక సమర్పించబడింది. అధ్యక్షుని ఉపన్యాసం పిదప మృచ్ఛకటికం అనే సంస్కృత నాటకంలోని పవను అంకం విద్యార్థులు ప్రదర్శించారు. బహుమతుల ప్రదానం జరిగినపిదప ప్రధానాచార్యుని వందనములతో సభ ముగిసినది.

## రాపూరు తాలూకా రైతుసంఘ సమావేశం

రాపూరు, మార్చి 8: వెంకటగిరిసోమశిల ప్రాజెక్టులో భాగంగానే సోమశిల ప్రాజెక్టు వెంటనే నిర్మించమని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ ఈనెల 6 వ తేదీన పొదలకూరులో ముద్దుబోయిన వెంకట్రామయ్య గారి అధ్యక్షతన జరిగిన రాపూరు తాలూకా రైతుసంఘం సమావేశంలో కొన్ని తీర్మానాలు చేశారు.

రాపూరు తాలూకాకు నీటిసప్లయి ప్రణాళికలనిమిత్తం 10 లక్షల రూపాయలు మంజూరు చేయ్యాలని ఆ విషయమై ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపే నిమిత్తం తోటపల్లి సుబ్బారావు, చిరువూరి ... వెంకటసుబ్బయ్య, పోకూరు పెంచలయ్య ప్రభృతులతో గాడి నారాయణయ్యగారి నాయకత్వాన ఆ సమావేశంలో ఒక ఉపసంఘం నియమించారు.

## అవసరమైతే గండికోటకు పులిచింతల నీరు

### రాయలసీమజిల్లాల కమ్యూనిస్టు కమిటీల ప్రకటన

అంకాళమ్మ గూడూరు, మార్చి 8: రాయలసీమ అభివృద్ధికి నిరంతరం కృషి చేస్తున్న కమ్యూనిస్టుపార్టీ అవసరమైతే గండికోటకు పులిచింతల నీటిని తరలించాలన్న సూచనను పూర్తిగా బలపరుస్తూంది. సర్కారుజిల్లాల కమ్యూనిస్టు కమిటీలు, ప్రజలు యిందుకు సంసిద్ధంగా వున్నారు." అని రాయలసీమ జిల్లాల కమ్యూనిస్టు కమిటీలు ఒక సంయుక్త ప్రకటన చేశాయి. శ్రీయుతులు గజ్జల మల్లారెడ్డి, వి. కె. ఆదినారాయణరెడ్డి, గుర్రం వెంకటరెడ్డి, వి. సీతారామయ్య, పి. వెంకట్రామప్ప గార్లు యీ ప్రకటనపై సంతకాలు చేశారు. ఈ ప్రకటనలో యింకా యిలా వున్నది:

"తెలుగుప్రజల ఐక్యాందోళన ఫలితంగా ఖోస్లా కమిటీ కృష్ణా పెన్నారు వ్యతిరేకంగా సూచించింది. కాని కృష్ణ నీటిని సమృద్ధిగా నీటి సౌకర్యాలున్న చెంగల్పట్టు జిల్లాకు తరలించమని సూచించడం శోచనీయం. గండికోట లేని సిద్ధేశ్వరం నిరుపయోగమని ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘం కార్యదర్శి శ్రీ వై. వి. కృష్ణారావుగారు అన్నారు. కృష్ణనీటిని గండికోటకు యివ్వాలనికూడ రాయలసీమ, సర్కారు కమ్యూనిస్టులు ఆందోళన ప్రారంభించారు. నందికొండతో పాటే సిద్ధేశ్వరం-గండికోట ప్రాజెక్టు నిర్మాణం కూడ జరగాలని తృతీయ కడపజిల్లా రైతుమహాసభలో తీర్మానించారు. కృష్ణ నీటిని గండికోటకి ప్పించడానికి కమ్యూనిస్టులు అంగీకరించారని యిటీవల కడపలో జరిగిన అఖిలపక్షసభలో పలువురు ఆరోపించారు. కాని కమ్యూనిస్టుపార్టీ కృష్ణనీటిని గండికోటకందించాలని బ్రహ్మాండమైన ఆందోళన చేస్తున్నది. అసలు మద్రాసు ప్రభుత్వం తయారుచేసిన ప్రణాళికలోనే గండికోటకు ప్రాధాన్యత యివ్వలేదు. గండికోటతో పాటు తుంగభద్ర ఎగువ కాలువ, యితర మైనరు ప్రాజెక్టులకోసం కూడ కమ్యూనిస్టులు ఆందోళన చేస్తున్నారు. కృష్ణనీరు అందితే గండికోట ప్రాజెక్టు ద్వారా 1 లక్షా 50 వేల ఎకరాలు సాగు కాగలదు. దీని కందరు తోడ్పడాలని కోరుతున్నాము."

## శ్రీ ప్రకాశంగారికి లక్ష రూ. బహూకరణ

### నెల్లూరులో శ్రీ వెంకటరంగం గారి ఉద్యమం

నెల్లూరు, మార్చి 10: ఆంధ్ర రాష్ట్రావతరణ శుభసమయంలో ఆంధ్ర నాయకులు శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులు గారికి 1 లక్షరూపాయలు బహూకరించేందుకుగాను ప్రజాసరివల్ అధ్యక్షులు శ్రీ కోట వెంకటరంగంగారు ఒక ఉద్యమం ప్రారంభించారు. గత 50 సంవత్సరాలుగా జాతికి దేశానికి ఆయన ఒనరించిన సేవకు ప్రతిఫలంగా యీ మొత్తం బహూకరించబడుతుంది. (పి. టి. ఐ.)

## మదనపల్లి, వాయల్పాడు తాలూకాలలో శిస్తు వసూళ్ల వాయిదా

మదనపల్లి, మార్చి 10: ఎండాకాలం ప్రవేశించేసరికి చాలామటుకు నూతులు ఎండిపోతున్నవి. మంచినీటి కొరత యేర్పడినది.

వాయల్పాడు, మదనపల్లి తాలూకాలలో అనావృష్టి కారణంగా యేర్పడిన పరిస్థితుల దృష్ట్యా శిస్తు వసూళ్లు మరో నెలపాటు అధికార్లు వాయిదా వేశారు. గొడ్డుపనులు ప్రారంభించి కూలీలకు పనులుకల్పించాలనీ, యితర సౌకర్యాలు కలుగజేయాలనీగూడ వుద్దేశిస్తున్నారు. (పి. టి. ఐ.)

## రేపల్లె తాలూకా పశు ప్రదర్శనము

రేపల్లె మార్చి 9: రేపల్లె తాలూకా ద్వితీయ పశుప్రదర్శనము నిన్న ఇచ్చట జయప్రదంగా జరిగింది. వుదయం ప్రదర్శనమును శ్రీ ఆలపాటి సూర్యనారాయణగారు ప్రారంభోత్సవము జరిపారు. ప్రదర్శనమునకు షుమారు 100 పశువులు వరకు అన్ని గ్రామములనుండి వచ్చినవి. ప్రదర్శనకువచ్చిన పశువులను తరగతుల వారిగా నిర్ణీత స్థలములలో స్థానిక పశువైద్యశాల డాక్టరు కృష్ణారెడ్డిగారు ఉంచారు. సాయంత్రం 2 గంటల నుండి జడ్జీలు ప్రదర్శనకు వచ్చిన పశువులను పరిశీలించారు.

సాయంకాలం పంచాయతీ బోర్డు అధ్యక్షులు నేతి వెంకటరమణగారు అధ్యక్షతన బహిరంగసభ జరిగినది. పశు సంపదను అభివృద్ధిచేయవలసిన ఆవశ్యకత, అందులోను ఒంగోలు జాతి పశువుల ప్రాముఖ్యత అందుకొరకు ప్రభుత్వమువారు చేయుచున్న కృషి మున్నగు విషయముల గురించి పలువురు ప్రముఖులు మాట్లాడారు. జిల్లా వెటర్నరి ఆఫీసరు జి. సి. శ్రీహరిసాయుడు గారు బహుమతులు పంచిపెట్టిరి. కె. కృష్ణారెడ్డిగారి వందనసమర్పణతో సభముగిసినది.

## గ్రామసీమలకు సేవచెయ్యడం వైద్యవిద్యార్థుల విద్యుక్తధర్మం

### విశాఖపట్నం మెడికల్ కాలేజీ వార్షికోత్సవ సభలో డా॥ అరుణాచలం హితోపదేశం

విశాఖపట్టణం, మార్చి 8: ప్రస్తుత ఆర్థికపరిస్థితులలో చికిత్సాసహాయం పొందలేని వారికీ గ్రామీణులకు సహాయపడడానికి వైద్య విద్యార్థులు కృషి చెయ్యాలని మద్రాస్ మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు డాక్టరు పి. అరుణాచలం గారు ఈ నెల 8వ తేదీ సాయంకాలం ఆంధ్ర వైద్యకళాశాల 27వ వార్షికోత్సవాలకు అధ్యక్షత వహిస్తూ అన్నారు.

కాలేజి ప్రిన్సిపాల్ డాక్టరు టి. కె. రామన్ గారు వార్షిక నివేదిక సమర్పించుతూ త్వరలో నేత్రశాస్త్రచికిత్సా పరిశోధనా శాఖ నెలకొల్పబడ గలదనీ ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆ శాఖకు ఆర్థిక సహాయం చేయనున్నదనీ అన్నారు. ఈ సందర్భంలో అయన ఇంకా యిలా వివరించారు:

"ఈ కళాశాల అధ్యాపకుల సహకారంతోను, కింగ్ జార్జి హాస్పిటల్ అధ్యాపకుల సహకారంతోను గ్రామీణులకు ఈ కళాశాల ఆధ్వర్యాన వైద్య సహాయం చేయబడుతున్నది. విశాఖపట్టణం రోటరీ క్లబ్బుకు చెందిన ఒక సంస్థ వారీ ప్రణాళిక నమలు జరుపుతున్నారు. ప్రస్తుతం ఆ ప్రణాళిక అమలు జరుగుతున్న గ్రామంలో తగినంతమంది స్వచ్ఛంద వైద్య సేవకులు లభించిన తరువాత ఆ ప్రణాళిక ఇతర గ్రామాలలో కూడా అమలు జరుపబడగలదని ఆశించుతున్నాను.

"వైద్య కళాశాలలలో పెరిగిపోతున్నవి. అనుభవంగల వైద్య విద్యాబోధకుల కొరత ఏర్పడుతున్నది. వైద్యవిద్యా పాటవం తగ్గిపోతున్నది. వైద్య విద్యాస్థాయి పెంపొందడానికి వైద్యశాస్త్ర వేత్తలు కృషి చెయ్యాలి."

విద్యార్థి సంఘం కార్యదర్శి జి. భాస్కరరావుగారు తమ సంఘం కార్యకలాపాల నివేదిక సమర్పించారు. కళాశాల నుంచి వెళ్లిపోతున్న విద్యార్థులకు ఇ. ఎక్స్. బి. శర్మగారు వీడ్కోలివ్వగా డాక్టరు లక్ష్మణరావు గారు కళాశాలలో విద్య పూర్తయిన విద్యార్థుల తరఫున సమాధానం చెప్పారు.

డాక్టర్ అరుణాచలంగారు తమ ప్రసంగంలో ఇలా అన్నారు:

"వైద్యశాస్త్రంలో యితోధికంగా పరిశోధనలు జరగాలి. ఈ విషయంలో జరిపే పరిశోధనల ఫలితాలు ప్రజల అనుభవంలోకి రావాలంటే వైద్యశాఖలో పనిచేసే వారికీ, పరిశోధనలు చేసేవారికి సదుమ సన్నిహిత సహకార మేర్పడాలి. జబ్బులు నయం చేయడానికి వినియోగపడే మందుల విషయంలో పెద్ద సమస్యలేమీ కనిపించవు. ప్రస్తుతం వాడుకలో వున్న మందుల సహాయంతో కొత్త మందులు కనిపెట్టవచ్చు.

"కాని వైద్యశాస్త్రంలో జరిగే పరిశోధనల సహకారంతో వ్యాధులు రాకుండా వాడే మందుల విషయంలో ప్రజలలో ప్రచారం చేయడం, వైద్యులు ఇతోధికంగా కృషిచేయ్యడం, చాలా అవసరం. ఆనేక వ్యాధినిరోధక మందులు కనిపెట్టబడుతున్నవి. వాటన్నింటిని సక్రమంగా వినియోగించుకోగలిగితే ఇప్పటి మరణాలు సగానికి సగం తగ్గివుండేవి. కనుక ప్రజారోగ్యం గురించి ఇతోధికంగా ప్రచారం చేయవలసిన అవసరమేర్పడుతున్నది. వైద్యశాస్త్రంలో ప్రత్యేక పరిశోధనలు చేసే శాస్త్రవేత్తలకు, సాధారణ వైద్యులకు నడుమ సన్నిహిత సహకారం వుండాలి. అప్పుడే రోగులకు మంచి వైద్యం లభించగలదు." (స్వ. వి)

## తెనాలి స్టేషన్‌లో 457 తు. నల్లమందు స్వాధీనం

### ఒకని అరెస్టు

తెనాలి, మార్చి 8: ఇక్కడ రైల్వేస్టేషన్ ప్లాటుఫారంమీద, యీ నెల 6వ తేదీ రాత్రి హైదరాబాదు సంస్థానమునకు చెందిన వ్యక్తివద్ద 475 తులాలనల్లమందును, తెనాలి రైల్వే పోలీసు సబ్ యిన్‌స్పెక్టరు సుబ్బారావుగారు స్వాధీనం చేసుకొని, అతనిని అరెస్టుచేశారు. ఈ నల్లమందు ఖరీదు 4 వేల రూ.లు వుంటుందని, సూట్ కేసులో భద్రపరచి తెచ్చాడని తెలియవచ్చింది.

## భట్టిప్రోలులో కాపుసారా స్వాధీనం: 7 గురి అరెస్టు

గుంటూరు, మార్చి 9: సెల్లటూరు సబ్ యిన్‌స్పెక్టరు శ్రీ సి. చెంచయ్యగారు మొన్న హెడ్ కానిస్టేబులు పార్థసారధిగారి సహాయంతో మొన్న రాత్రి భట్టిప్రోలు గ్రామంలో దాడిచేసి, యిద్దరు ఆంగ్లో స్త్రీలతో సహా 7గురు వ్యక్తులను, 17 గాలన్ల సారాయితో పట్టుకొన్నారు. అరెస్టుచేసి రేపల్లె సబ్ మేజస్ట్రేటుగారివద్ద ఛార్జీలు దాఖలు చేశారు. (స్వ. వి.)

## రాయలసీమ విశ్వవిద్యాలయం

### తిరుపతిలో పెట్టాలని పాకాల విద్యార్థుల విజ్ఞప్తి

తిరుపతి, మార్చి 9: పాకాలవిద్యార్థులు, మొన్న నీమధ్య శ్రీ రాజరత్నం పిళ్లై అధ్యక్షతన సమావేశమై రాయలసీమకు ప్రత్యేకంగా విశ్వవిద్యాలయాన్ని తిరుపతిలో యేర్పాటు చేయాలని, సత్వరమే ఆంధ్ర రాష్ట్రాన్ని స్థాపించాలని సెప్టెంబరు పరీక్షలకు హాజరయ్యే విద్యార్థులకు స్కూళ్లలో తరగతులు పెట్టి బోధించాలని ప్రభుత్వాన్ని అర్థిస్తూ తీర్మానం చేశారు.

పాకాలస్కూలును మంచి భవనంలో యేర్పాటు చేసి లేబొరేటరీ సౌకర్యం కల్పించాలని కోరారు. డిటెన్షన్ విధానాన్ని నిరసిస్తూ మరో తీర్మానం చేశారు. సమావేశంలో ఆ.ఎం. రత్నం చంద్రమోహన్ చౌదరి, టి. ఐ. ఎన్. రాఘవచౌదరి ప్రభృతులు మాట్లాడారు. (స్వ. వి.)

## సత్తెనపల్లిలో స్కూలుఫైనలు పరీక్షాకేంద్రం ఎత్తివేత

సత్తెనపల్లి, మార్చి 8: 1941 వ సంవత్సరంనుండి వరుసగా ఇచట నే ఉంటూ ఉన్న ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షా కేంద్రం యెత్తివేయడంవల్ల ఈ సంవత్సరం ఇచట బాలబాలికోన్నత పాఠశాలల స్కూలు ఫైనలు విద్యార్థులు దాదాపు 160 మందికి ఇచట పరీక్షా కేంద్రం లేకుండాపోయినది. దీనికి కారణాలు ఏమైనప్పటికి ఇంతమంది బాలబాలికలను ఇతర ప్రదేశాలకు పరీక్షలు వ్రాయుటకు పంపించటం చాలా అన్యాయంగా ఉన్నదని విద్యార్థులు ఆందోళన చేస్తున్నారు. భయంకరమైన ఈ కరువుకాటకపు రోజులలో ఈ అదనపు ఖర్చులు భరించుట విద్యార్థుల తల్లిదండ్రులకు చాల భారంగా ఉంది. విద్యాశాఖవారు ఇంతమంది విద్యార్థులను పరీక్షపత్రాలు వ్రాయుటకు ఇతర చోట్లకు పంపినయెడల అచటివారికి అనేక ఇబ్బందులు కలుగగలవని గ్రహించి తిరిగి ఈ సంవత్సరం గూడ యథాప్రకారం పరీక్షలు జరుగునట్లు చేయవలెనని ప్రజలు ఆశిస్తున్నారు.

## బళ్ళారిజిల్లా ఆంధ్రరాష్ట్రంలో చేర్చవద్దు

### రాష్ట్రపతికి, ప్రధానికి హైదరాబాద్ శాసనసభ్యుల విజ్ఞప్తి

సికిందరాబాదు, మార్చి 9: అవతరింపనున్న ఆంధ్రరాష్ట్రంలో బళ్ళారిజిల్లానుకూడ చేర్చడానికి న్యాయమూర్తి వాంఛూ శిఫార్సు చేశారన్న వార్తను ఆదుర్దా వెల్లడిస్తూ, ముగ్గురు మంత్రులూ, డిప్యూటీ స్పీకరుతో సహా హైదరాబాదు శాసన సభలోని 26 మంది కర్ణాటక సభ్యులు రాష్ట్రపతికీ, భారత ప్రధానికీ ఒక విజ్ఞప్తి పంపుకొన్నారు. ఈ సభ్యులలో కాంగ్రెసుతో సహా అన్ని పార్టీలవారూ ఉన్నారు. మంత్రులు డా॥ జి. యస్. మేల్కోటే, అన్నారావుగణాపే, శంకరదేవుగారు, డిప్యూటీస్పీకరు పాపన్న గౌడగారు.

ఆ విజ్ఞప్తిలో ఇట్లున్నది: "బళ్లారి జిల్లా నంతనూ ఆంధ్రరాష్ట్రంలో చేర్చడానికి న్యాయమూర్తి వాంఛూ శిఫార్సు చేశారన్న వార్తకు మేమంతా ఖిన్నులమైనాము. బళ్లారిజిల్లా సంపూర్ణంగా కన్నడిగ మయమైన జిల్లా అనీ, దానిని ఆంధ్రరాష్ట్రంలో చేర్చినట్లయితే ఆ కొత్త రాష్ట్రంలో తీవ్రమైన మైనారిటీ సమస్య రేపుతుందనీ, క్రమేణా అది ఆంధ్రరాష్ట్ర అవతరణోద్దేశ్యానికే భంగం భంగం తేవచ్చుననీ మీకు తెలియజేయడం మా విధిగా భావిస్తున్నాము. బళ్ళారిని ఆంధ్రలో చేర్చే విషయంలో అన్ని ప్రాంతాల కన్నడిగలూ తమ తీవ్ర అసమ్మతిని తెలియజేసే వున్నారు. శేషించిన మదరాసు రాష్ట్రంలోనే దానిని ఉంచనిమ్మనీ, లేదా మైసూరులో కలిపివేయమనీ కోరారు. ఆ సూచనలను మేముకూడ మనస్ఫూర్తిగా ఆమోదిస్తున్నాము ఇంతమంది ఇంతగా కోరుతున్నప్పటికీ, కాదని ఒకవేళ దానిని ఆంధ్రలో కలిపేటట్లయితే ప్రమాదకరమైన పరిణామాలకు దారితీసే పరిస్థితి ఏర్పడవచ్చునని మా యందరి అభిప్రాయమైయున్నది. ఈ సంగతులన్నీ దివ్యచిత్తమునకు తేగోరెదము."

## మదనపల్లిలో స్త్రీ సంక్షేమ కేంద్రం

మదనపల్లి, మార్చి 10: ఇచట వున్న సోషల్ వెల్ఫేర్ బోర్డు శాఖ కేంద్రంవారు త్వరలో యిక్కడ ఒక స్త్రీ సంక్షేమ కేంద్రం, అనాథ శిశరక్షాలయం, స్థాపిస్తారు. దంపులు వేయుటం, కుట్టుపని, మున్నగు వాటిలో శిక్షణ యివ్వబడునుంది. పరిసర కుటుంబాల పిల్లలకుకూడ బోధిస్తారు. క్రిందటి యేడు దీనికి రు 2000/-లు రాష్ట్ర సంక్షేమ నిధినుంచి మంజూరు అయినవి.

## మార్షల్ స్టాలిన్ అస్తమయం

### ఆంధ్రదేశంలో సంతాపసభలు

**మంగళగిరి**

సోవియట్ రష్యా అధినేత మార్షల్ స్టాలిన్ మరణించినట్లు వార్త రాగానే స్థానిక కమ్యూనిస్టు పార్టీవారు, యీ వార్తను పట్టణమంతా తెలియపరచి, సాయంకాలం గాంధీ చౌకులో కొండ్రు రామయ్యగారి అధ్యక్షతన బహిరంగ సభ యేర్పాటు చేశారు. మార్షల్ స్టాలిన్‌కు జోహార్లర్పిస్తూ సభలో తీర్మానం చేశారు.

**గుంతకల్లు**

పట్టణ కమ్యూనిస్టుపార్టీ తరఫున శుక్రవారం సాయంకాలం స్థానిక కమ్యూనిస్టు నాయకుడగు యం. గోవిందులుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరుపబడినది. సెట్టినాండ్లు, మార్షల్ స్టాలిన్ అమూల్య జీవిత విశేషాలను తెలుపుతూ సభలో ఉపన్యసించారు. కొప్పాలు అంజనేయులుగారు ఉపన్యసిస్తూ, స్టాలిన్ ఒక్క రష్యాకేగాదు, యావత్తు పీడిత ప్రజానీకానికి నాయకుడని, కార్మిక, కర్షక ప్రజారాజ్యాన్ని లెనిన్ సృష్టిస్తే, దాన్ని పెంచి పోషించిన మహానాయకుడు స్టాలిన్ అని అన్నారు. కె. ఆర్. వీరణ్ణ, సోవియట్ రష్యా అభివృద్ధికి స్టాలిన్ చేసిన కృషిని వివరించారు. అధ్యక్ష ప్రసంగం అనంతరం, స్టాలిన్ మరణంపట్ల గాఢ సంతాపాన్ని ప్రకటిస్తూ, సభవారు, పక్కీరప్పగారు ప్రతిపాదించిన తీర్మానాన్ని ఆమోదించారు.

**తణుకు**

జోసెఫ్ స్టాలిన్ మరణమునకు సంతాప సూచకంగా, 6 వ తేదీ మధ్యాహ్నం ఈ పట్టణంలో ఒక గంటసేపు దుకాణాలు మూసివేశారు. తాలూకా కమ్యూనిస్టుపార్టీ ఆఫీసు కమ్యూనిస్టు పతాకం విచారసూచకంగా దింపి వేయబడింది. సాయంకాలం రాత్రి కమ్యూనిస్టుపార్టీ నాయకులలో ఒకరగు ఉద్దరాజు రామంగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగినది. స్టాలిన్ జీవిత విశేషాలను, పరిపాలనా దక్షతను గురించి, చేరుకువాడ నరసింహం పంతులు, వి. వి. ఎస్. శర్మ, వంకా సత్యనారాయణగారలు ఉపన్యసించారు. స్టాలిన్ అస్తమయమునకు గాఢసంతాపం ప్రకటిస్తూ, సోవియట్ ప్రభుత్వానికి ప్రజలకు తమ సానుభూతి తెలుపుతూ, విశ్వశాంతికి సోవియట్ ప్రజలతో పాటు తాముగూడ సర్వవిధాలా కృషి చేస్తామని వాగ్దానం చేస్తూ, సభవారు తీర్మానం చేశారు.

**ఉరవకొండ**

పట్టణ కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన 7 వ తేదీ సాయంకాలం పాత బస్సు స్టాండులో, జి. సెట్టు కల్లప్ప గారి అధ్యక్షతన స్టాలిన్ మరణమునకు సంతాపం ప్రకటించునిమిత్తం బహిరంగసభ జరిగినది. స్టాలిన్ జీవిత విశేషాలనుగురించి, యుద్ధ నివారణకు, శాంతిసంరక్షణకు ఆయన చేసిన కృషిని గురించి శ్రీయుతులు బి. చిన్నరామప్ప జి. శంకరయ్యగారలు ఉపన్యసించారు. తర్వాత స్టాలినుకు జోహార్లర్పిస్తూ అధ్యక్షులు ప్రతిపాదించిన తీర్మానాన్ని సభవారు, భక్తిపురస్సరంగా లేచినిలువబడి ఆమోదించారు.

**వేల్పూరు**

పట్టణ కమ్యూనిస్టుపార్టీ సభ్యులు, సానుభూతిపరులు ముత్యాల సూర్యనారాయణగారి అధ్యక్షతన సమావేశమై స్టాలిన్‌మృతికి సంతాపం ప్రకటిస్తూ తీర్మానించారు.

**జగ్గయ్యపేట**

తాపీపనివారు, మున్సిపలు కార్మికులు, రజకులు, వ్యవసాయకులు మొదలగువారందరూ, 7 వ తేదీ మధ్యాహ్నము స్టాలిన్ చిత్రపటముతో పట్టణములో ఊరేగింపు జరిపారు. సాయంత్రము కందిబండ వీర్చయ్యగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగినది. వి. ఎస్. ఆర్. అంజనేయులు, నంజుల వెంకట్రామరెడ్డిగారలు స్టాలిన్ జీవిత విశేషాలను వివరిస్తూ మాట్లాడారు.

**తిరుపతి**

పట్టణ కమ్యూనిస్టుపార్టీ యాజమాన్యాన 8 వ తేదీ సాయంకాలం జి. శివయ్యగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగినది. ప్రపంచ మహానాయకుని మృతికి సంతాపం ప్రకటిస్తూ సభవారు తీర్మానం చేశారు. ఆర్. ఎం. రత్నం గారు స్టాలిన్ జీవితవిశేషాలను, సోవియటురష్యా అభివృద్ధికి ఆయన చేసిన మహత్తరకృషిని వివరిస్తూ ప్రసంగించారు. భారతదేశం సోవియట్ రష్యాను ఆదర్శంగా పెట్టుకొని పనిచేస్తే గొప్ప దేశం అవుతుందని గూడా ఈయన అన్నారు.

**చిత్తూరు**

పట్టణ కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన చిత్తూరుగవడిలో బహిరంగసభ జరిగినది. స్టాలిన్ ప్రతిభావిశేషాలను గురించి పలువురు ప్రసంగించారు. స్టాలిన్ మృతికి సంతాపంప్రకటిస్తూ తీర్మానం చేశారు.

**కృష్ణాజిల్లా రైతుసంఘ సంతాపం**

కృష్ణాజిల్లా రైతుసంఘం తరఫున సంఘ ప్రధానకార్యదర్శి పల్లంకి వేంకటేశ్వరరావుగారు కామ్రేడ్ స్టాలిన్ మృతికి సంతాపం ప్రకటిస్తున్నారు.

## ఖైదీల సంతాపం

బందరు, మార్చి 9: ఇక్కడి సబ్ జైలులోని 20 మంది అండర్ ట్రయల్ ఖైదీలు, స్టాలిన్ మరణవార్త విని, 7 వ తేదీ సాయంకాలం ఆహారం తీసుకోమటూని, తమ సంతాపం ఆవిధంగా ప్రకటించారు.

**గుంటూరు**

మార్షల్ స్టాలిను మరణమునకు తమ సంతాప సానుభూతులు ప్రకటించుచు 6 వ తేదీ సాయంకాలము గాంధీ పార్కులో పట్టణ కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షులు కామ్రేడ్ వై. తిరుపతయ్యగారు అధ్యక్షతన బహిరంగసభ జరిగినది. విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి యన్. ఆర్. దాసరిగారు స్టాలిన్ జీవితవిశేషములు గూర్చి ఉపన్యసించారు. కామ్రేడ్ త్ర్యంబకం గారు మార్షల్ స్టాలిన్ గారి రాజకీయ చతురతను, శక్తిసామర్థ్యములను ప్రశంసించి రష్యా దేశమును బీదలకొక స్వర్గరాజ్యముగా నిర్మించారన్నారు.

7 వ తేదీన పట్టణంలో హర్తాలు జరిగింది. కమ్యూనిస్టులు ఊరేగింపు చేసి గాంధిపార్కులో నిన్న సాయంకాలం పట్టణ కార్మిక సంఘం యాజమాన్యాన ఒకసభ జరిపారు. కామ్రేడ్ హుస్సేన్ గారు సభకు అధ్యక్షతవహించారు.

కామ్రేడ్ తిరుపతయ్య, సయ్యద్ మహబూబ్ గారలు కమ్యూనిస్టు విధానమునకు మార్షల్ స్టాలిన్ ప్రపంచరంగములో ఎంత గౌరవప్రపత్తులు సంపాదించారు వివరించారు. స్టాలిన్ ఆశయానుసారం కమ్యూనిస్టులతో సహచులై ప్రపంచశాంతి స్థాపించ గలరని తమ విశ్వాసాన్ని ప్రకటించారు.

గుంటూరు సాహిత్య గోష్ఠివారు నిన్న సాయంకాలం శ్రీ పాలపర్తి రామమూర్తి గారింట్లో సమావేశమై స్టాలిన్ మరణమునకు తమ సంతాప సానుభూతులు ప్రకటించారు.

## తెనాలి పురపాలక సంఘ సమావేశం

### టౌను ప్లానింగు అఫీసరు అధికారములపై నిర్ణయం

తెనాలి, మార్చి 9: మొన్న దినం చైర్మన్ వన్నవ వెంకట్రావుగారి అధ్యక్షతన జరిగిన అత్యవసర సమావేశంలో, పురపాలక సంఘంవారు, కమీషనర్ నోటులో పేర్కొనబడిన అధికారములను టవున్ ప్లానింగు కమీషనర్ గారికి వప్పగించుటకు నిరాకరిస్తూ ఏకగ్రీవంగా తీర్మానించారు. ఆ పదవి తాత్కాలికమైనందువల్ల, యిదివరకే అనేక దశలలో టవున్‌ప్లానింగు ఆఫీసరుగారి కార్యనిర్వహణ అసంతృప్తికరముగా ఉన్నదని నమోదు చేయుటనుబట్టి, అట్టి అధికారములను టవున్ ప్లానింగు ఆఫీసరుకు వప్పగింతపెట్టరాదని కమీషనరును ఆదేశిస్తున్నామని పురిపాలక సంఘంవారు తమ తీర్మానంలో పేర్కొన్నారు.

## నాగస్వర విద్వాంసుని మృతి

బందరు, మార్చి 9: సుప్రసిద్ధ నాగస్వర విద్వాంసుడు శ్రీ చినముక్కల సూర్యనారాయణగారు, 7వ తేదీరాత్రి ఆకస్మికంగా చనిపోయారని తెలుపుటకు విచారిస్తున్నాం. ఆరోజు రాత్రి నీరు మేళమునకు వెళ్లివచ్చిన కొలది గంటలకు యీ ఆకస్మికమృతి సంభవించినది. వీరివద్ద నాగస్వరం నేర్చుకొంటున్న శిష్యులనేకమంది ఉన్నారు.

# ఆంధ్రజిల్లాల్లో క్షామబాధితులకు తగినంత సహాయం లేదు

## గవర్నరుప్రసంగంపై అసెంబ్లీ సభ్యుల విమర్శ

మద్రాసు, మార్చి 11: గవర్నరు ప్రసంగంపై రాష్ట్ర అసెంబ్లీలో చర్చ నిన్న ప్రారంభమైంది. 26 సవరణలు ప్రతిపాదింపబడినవి. (ఇంతవరకూ జరిగిన అసెంబ్లీ కార్యక్రమ వివరాలు నిన్నటి పత్రికలోనే ప్రకటింపబడినవి.]

తరిమెల నాగిరెడ్డిగారు (అనంతపురం-కమ్యూనిస్టు) ఇలా చెప్పారు:- "క్రిందటి శాసనసభా సమావేశానికి ఇప్పటి సమావేశానికి మధ్య ఎన్నో ప్రధానమైన ఘట్టములు నడిచినవి. శ్రీరాములుగారి ఆత్మార్పణ, అసందర్భంలో నడిచిన ప్రజోద్యమంలో అనేకమంది యువకులు బలిగావటం- అపై ప్రభుత్వ ప్రకటన ఈ గాథ అందరికీ తెలిసినదే. ఆంధ్రుల చిరమనోరథం ఈనాడు సాఫల్యమవుచున్నప్పుడు, సుహృద్భావంతో, స్నేహభావంతో ఇందుకు సంబంధించిన సమస్యలను పరిష్కారం కాగలదని ఆశిస్తున్నాను. కమ్యూనిస్టుపక్షం అందుకు తోడ్పడగలదని నేను హామీ ఇస్తున్నాను."

"రాష్ట్రంలో పలుచోట్ల కరవు పరిస్థితులు నెలకొన్నవి. రాయలసీమను గూర్చి ప్రత్యేక శ్రద్ధవహించాలి. ఈ బాధలు నివారించాలని అనేక విజ్ఞప్తులు ఇదివరలో సమర్పించాము. మీరంతా అక్కడికి వచ్చి కన్నీరు జలజల కార్చినారు. మీ కన్నీళ్లు తుడిచినంత మాత్రాన చాలదు. ఈ ప్రభుత్వ యంత్రం ఇంతకాలంగా జరుగుతూన్న పద్ధతినే సాగుతోందిగాని అధికంగా ప్రయోజనం లేదు."

"ఈమధ్యన ఎన్నిక జరిగిన పుత్తూరు తాలూకాలో అమాత్యులు పర్యటించారు. అనేక గ్రామాల్లో కొన్ని కుటుంబాలు ఇండ్లను వదలిపోయారని మేము గమనించాము. అట్టి దుర్భర స్థితిలో వారుండగా వారికి ఏమి చేశారు? వారిని గూర్చి గవర్నరు ప్రసంగంలో ప్రస్తావనే లేదే! 'చిత్తూరుజిల్లా నుంచి అనేకమంది అనంతపురం జిల్లాకు వలసవస్తున్నారు. వారి యోగక్షేమాన్ని వహించేవారు కనిపించరు. భోజనంలేని జనాన్ని, తినడానికి గడ్డిలేని పశువులను, త్రాగడానికి నీరులేని అందరి అవస్థలను కండారచూచి ఏమి చేశారు? ప్రజల హాహాకారములన్నీ బధిర శంఖారావములేనా? కదిరి, తాడిపత్రి తాలూకాల్లో కరువు వచ్చినది. సహాయము చేయకపోగా శిస్తు వసూళ్లు నిర్బంధము చేస్తున్నారు. కరువు దక్షిణాదికికూడా వ్యాపిస్తున్నది. ఆకలి మరణాలు సంభవిస్తున్నదనగా లేదు లేదు అని ప్రభుత్వం అంటుంది. గంజికేంద్రాలను నిర్వహింపలేకపోతే ప్రజలకు పని చూపించాలి."

"ఈ బాలుకు కరువు రాకుండా ఏమి చేశారు? ఎన్ని చెరువులు రాయలసీమలో త్రవ్వించారు? ఎన్ని కాల్వలు బాగుచేయించారు? కార్యక్రమం లేని ప్రభుత్వం తాను దివాలాతీసి ప్రజలను దివాలా తీయిస్తుంది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం పేరిట అవసర చర్యలను కూడా వాయిదా వేయడం సబబుగాదు. కృష్ణ అనకట్ట గట్టిగా వరద వస్తే కొట్టుకు పోతుందనీ, కేంద్ర ప్రభుత్వం డబ్బు ఇస్తామన్నా మద్రాసు ప్రభుత్వం కిమ్మన్నట్టిగా వున్నారనీ వింటున్నాము. ప్రజల మంచిని విచారించేవారు చెయ్యవలసిన పనులు ఇవి గాదని హెచ్చరిస్తున్నాను."

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు (సత్తెనపల్లి-స్వతంత్ర) "పొట్టి శ్రీరాములుగారు ఆత్మార్పణం చేసిన ఫలితంగా ఆంధ్ర దేశాన్ని ఉద్రూతలూగించిన ఆంధ్రోద్యమ ప్రస్తావన ఇందులో చేయకపోవడం విచారకరం. ఈ సందర్భంలో ఉద్రేక పూరితమైన ప్రజా సమావేశాలు ఏమైనా చేస్తే ప్రభుత్వం కేసులు పెట్టి సాధించడం భావ్యం గాదు

"గవర్నరు ప్రసంగంలో తమిళనాడు కుసాను గూర్చి కొట్లాటించాం తొడుగుంటే ప్రస్తావన చేశారుగాని, విశాఖపట్నం మున్నగు ఆంధ్రమండలాల్లోని కరువు పరిస్థితులను ప్రస్తావించకపోవడం శోచనీయం. ఆంధ్రమండలాల ప్రజల అవసరాలను గుర్తించకుండా, ధాన్యాన్ని అపరిమితంగా దక్షిణాదికి ఎగుమతి చేయడంవల్ల సామాన్యప్రజలు తిండికి గింజలు సరసమైనధరలకు దొరక్క బాధపడుతున్నారు. ధాన్యం ఎగుమతికి ఆక్షేపించను ప్రాంతీయ అవసరాలను మరచిపోవద్దంటున్నాను."

"గవర్నరుగారు ఒక వాడి వరసా లేకుండా ప్రసంగాలు చేస్తున్నారు. ఒకచో మద్రాసులోనే ఉంచుకోమంటారు. బెజవాడపల్లి బెజవాడ అంటున్నారు. నెల్లూరువచ్చి 'మా నెల్లూరు భేషుగ్గా ఉంది' అన్నారు. మాపట్టైన పల్లె వస్తారట, మాపూరూ బాగా చేవుంటుందంటారేమో! గవర్నరుగారు వారి హోదాకు తగిన విధంగా ఉండటం లేదు. ఆయన వేదాంతి. వేదాంతులు వస్తున్నారు. చెంబూ తప్పేదా ఇంట్లో వేసుకోండి అన్న విధంగా ఉంది వారిపని. వారి ప్రసంగాలు వారి హుందాకు తగినట్లుగా మాత్రము లేవు. ప్రభుత్వము, మంత్రులు, గవర్నరు, వాంచూగారికి ఏమి చెప్పారో అదంతా చిదంబర రహస్యముగా ఉంచారు. వాంచూగారు తీర్పు అని చెప్పే వార్తలే నిజమే అయితే, ఆయన తీర్పరిగాగాక న్యాయవాదిగా వర్తించారని చెప్పక తప్పదు."

"తమిళ నాయకులు ప్రజలను ఆవేశకావేశాలకు గురిచెయ్యరాదు. భావితరాల శ్రేయస్సు నెంచితే వారు ప్రశాంతంగా వ్యవహరించాలి."

"ఆంధ్ర ప్రాజెక్టులను గూర్చి పంచవర్ష ప్రణాళికకు ఏమి చేర్చారు. నందికొండ కథ ఏమైంది. ఖోస్లాకమిటి నందికొండ దక్షిణకాల్వ 24,600 క్యూసెక్కుల జలం ప్రవహించే సమర్థత గల్గినదిగా ఉండాలంటే ఈ ప్రభుత్వం పరిశోధన 15,000 క్యూసెక్కులకే పరిమితం చేసింది. ఈపరిశోధన 9 మాసాల్లో చేస్తారట. పెద్ద ప్రాజెక్టులమాట అల్లా ఉంచండి. గుండ్లకమ్మ మున్నగు చిన్న ప్రాజెక్టుల మాట లేవు లేదురు. ఉన్నవి ఊడిపోకుండా కొపాడి డెల్టా కృష్ణ అనకట్టను రక్షిస్తే చాలు. అందుకు ప్రభుత్వం చూపవలసినంత శ్రద్ధ చూపడం లేదు. గవర్నరుగారిని మేము అభినందించడానికి బదులు వారు త్వరగా సెలవు తీసుకోవడం మంచిది. కె. వినాయకంగారు ఆంధ్రతమిళ జనాభాల గూర్చి వివరణ చెబుతామనగా ఉపాధ్యక్షులు వివరణతో పనిలేదన్నారు. శ్రీ సి. హెచ్. లోకనాథమ్ యిట్లు తెలిపిరి.

కమ్యూనిస్టు భాషారాష్ట్రాల సిద్ధాంతాన్ననుసరించి ఆంధ్ర, తమిళ, కర్నాటక, కేరళ రాష్ట్రాలను ఏర్పరచాలి. ఆంధ్రులు రాష్ట్రమును సాధించుకుంటున్నందుకు అభినందిస్తున్నాము.

శ్రీ కోటిరామయ్య చౌదరి (ఉదయగిరి ప్రజాసోషలిస్టు), గవర్నరు ప్రసంగం నియమంతృత్వ ప్రభుత్వచిహ్నంగా ఉందిగాని సామాన్య ప్రజపడ సానుభూతిసూచకంగాలేదు, ప్రజల్లో, దేశాల్లో మార్పుకనిపించినా, వారి ప్రసంగంలో ఎంతమాత్రం చలనం కనిపించదు. నెల్లూరుజిల్లా మెట్ట తాలూకాల్లో కరువు కోటకొలు తాండవిస్తున్నది. ప్రభుత్వం ఎంతమాత్రం సహాయం చేయడం లేదు. మంత్రులు వచ్చి సంపన్నులయింట విందారగించి, నున్నని తారురోడ్లపై కార్లల్లో తిన్నగా మద్రాసు ప్రయాణించడం తప్ప ప్రజలకష్టాలు గమనించి తీర్చలేకున్నారు. ఈ ధన్యవాద తీర్మానమునకు మూడురోజులు వృథా చేసి ప్రజాద్రవ్యాన్ని సభ్యుల బత్తాల క్రింద వినియోగించడంకన్న రెండు మూడు గంటల్లో దీన్ని తేల్చివేయచ్చు."

"ప్రభుత్వ ఆసుపత్రులలో తగిన సౌకర్యాలు లేవు. రైతుకూలీ సమస్య పరిష్కారానికి ప్రభుత్వం యత్నించాలి. ఆవిధమైన భూమి సంస్కరణ తేవాలి. భూమి సాగుపడటానికి ప్రాజెక్టులు కావాలి. అందుకు కృష్ణా గోదావరి జలాలు సైతాంగానికి సద్వినియోగం కావాలి. పంచవర్ష ప్రణాళికలో ఒక్క ప్రాజెక్టుకూడా చేర్చలేదు. ఈ ప్రణాళిక కాంగ్రెసు వ్యతిరేకపక్షాలను దెబ్బ తీయడానికే వచ్చివున్నట్లున్నది."

శ్రీ ముళ్లపూడి వీరభద్రం [పరవాడ-కమ్యూనిస్టు.] "నేడో రేపో రాష్ట్రం వస్తుందని గవర్నరుగారు అన్నారు. గాని వ్యవహారాలు చూస్తే రాష్ట్రం వాయిదా వేయడానికి "కుంభకోణం" జరుగుతున్నట్లున్నది. శ్రీరాములుగారి ఆత్మ బలిదానంవల్ల అనంతరం విశాఖపట్నం, అనకాపల్లి, తాడేపల్లిగూడెం, నెల్లూరులో జరిగిన అన్యాయపు కాల్పులను గూర్చి విచారణ చేయించాలి. కాల్పులకు బాధ్యులైన వారిపై చర్య తీసుకోవాలి"

విశాఖపట్నం జిల్లాలో కరువు పరిస్థితులు ఏర్పడినవి. వాటి నివారణకు తోడ్పడాలి. అక్కడి నీటిపారుదల ప్రాజెక్టులందే శ్రద్ధ చూపాలి. మంచి నీటి సౌకర్యాలు అనేకచోట్ల కల్గించాలి. ప్రాతిపదిక విద్యా మందిరాల్లో మంచి సౌకర్యాలు వైద్య సౌకర్యాలు వృద్ధిచేసుకోవాలి. పోలీసు అత్యాచారాలు అరికట్టికొవాలి"

"మేము శాసనసభ్యులమైనా పోలీసుఉద్యోగుల పెత్తనంత్రవతేరంకాదు. మాకు వచ్చే ప్రతి ఉత్తరాన్ని శోధిస్తున్నారు. మాకే ఈ విధంగా జరుగుతోందో-లేక అందరికీ జరుగుతోందో? ఈ శోధన కారణాలు ఒప్పందం ప్రజలకు క్షేమంగాదన్నారు. అది ప్రజాక్షేమమా ప్రభుత్వ క్షేమమా ఈ పద్ధతి మాదేయ్యాలి"

శ్రీ [illegible] అంతటితో [illegible] సభను వాయిదా వేశారు.

---

కవున్సిల్ - ప్రశ్నోత్తరాలు:

# దేశీయ వైద్యుల హోదా

## కవున్సిల్లో ఆరోగ్యమంత్రి వివరణ

మదరాసు, మార్చి 9: దేశీయ వైద్య కళాశాలకు కావలసిన ఓషధులను పెంచుటకు ఆరాకుం మంజూరు చేయబడిందని ఆరోగ్యమంత్రి నేడు కవున్సిల్లో శ్రీ పురుషోత్తం మొదలియార్‌కు వ్రాతపూర్వక సమాధానం యిచ్చారు.

1950 డిసెంబరు 15న అరంబక్కం గ్రామంలోని 14. 16 ట్ల భూమిని ఇందు నిమిత్తం దేశీయ వైద్యశాఖకు కేటాయించబడిందనీ భూమి సొరక పల్లాలు సరిచేయబడి కంచమూడ వేయబడిందని మంత్రిగారు సమాధానంలో తెలియజేశారు.

### జి. సి. ఐ. యం. వారి హోదా

దేశీయ వైద్యపట్టభద్రులను ఇతర వైద్య పట్టభద్రులతో సరిసమానముగ చూడటంలేదని ఆరోగ్యమంత్రి శ్రీ ఎ.బి. షెట్టి ఇవ్వాళ కవున్సిల్లో శ్రీటి. పురుషోత్తం మొదలియార్‌కు చెప్పారు.

దేశీయ వైద్యులు ప్రస్తుతం ప్రభుత్వం ఎగ్జిక్యూటివు రూల్సు ననుసరించి దేశీయవైద్య కేంద్రబోర్డు వారిచే రిజిష్టరు చేయబడుతున్నారనీ, వారికి చట్టక్రిందరిజిష్టరు చేసేవిషయం పరిశీలనలో వుందని కూడ మంత్రిగారు తెలియజేశారు.

శ్రీ పురుషోత్తం: చోప్రా కమిటీ శిఫార్సులను పరిశీలించారా? దానిమీద ఏమి ఉత్తర్వులు చేశారు?

మంత్రి: వేరే ప్రశ్న వేయండి.

డా॥ సి. పాదమునినాయుడు: జి. సి. ఐ. యం లను ఎల్లా దేనిక్రింద రిజిష్టరు చేస్తారు. వారు చదివింది అలోపతికి భిన్నమైంది కాదా?

మంత్రి: మదరాసు మెడికల్ రిజిస్ట్రేషన్ చట్టంక్రింద రిజిష్టరు చేస్తాం అని చెప్పలేదు.

శ్రీ పురుషోత్తం: ఇతర వైద్య పట్టభద్రులకు ఇచ్చే జీతాలను దేశీయ వైద్యులకు కూడ ఇస్తున్నారా?

మంత్రి: జీతాలు వేరుగ వున్నాయి.

డా॥ దోరముని: దేశీయవైద్యులు అలోపతీ వైద్యుల ప్రమాణమునకు ఎల్లా వస్తారు?

మంత్రి: జి. సి. ఐ. యం. లు యూనివర్సిటీ పట్టభద్రులు కారు. దేశీయ వైద్యకళాశాలను మదరాసు విశ్వవిద్యాలయం పరిగణించ నిరాకరించింది,

ఈ రెండువిధానములను ఒక పెత్తనం క్రిందికి తీసుకొనివచ్చే యోచన ఏమీలేదని కూడ మంత్రిగారు తెలియజేశారు.

### జిల్లాబోర్డు స్కూలు

1952-53 లో 7 జిల్లాబోర్డు స్కూళ్ళ యాజమాన్యమును ప్రభుత్వం స్వీకరించింది. అవి భద్రాచలం, మార్చి హాళ్లి, కున్నత్తూర్, పరమకుడి, కోటగిరి, ఈరూర్, ముక్కూళ్ళని విద్యామంత్రి నేడు కవున్సిల్లో ఒక ప్రశ్నకు సమాధానం ఇచ్చారు.

---

# మద్రాస్ రాష్ట్రంలో పత్తి ఉత్పత్తి తగ్గుదల

కోయంబత్తూరు, మార్చి 9: మద్రాసు రాష్ట్రంలో ఈ యేడాది పత్తి ఉత్పత్తి 1.75 లక్షల బేలుల మేరకు తగ్గిపోతుందని అంచనా వేశారు. మామూలుగా 3.75 లక్షల బేళ్ళు ఉత్పత్తి ఆయేది. ఈ తగ్గుదలకు కాలమాన పరిస్థితులు బాగుండక పోవడమే కారణమట.

పత్తినాటే భూమి విస్తీర్ణం కూడా 3 లక్షల ఎకరాల మేరకు తగ్గుతుందిట. మామూలుగా 18 లక్షల ఎకరాలలో పత్తి నాటుతారు.

---

క్రీడారంగం:

# రాష్ట్ర టెన్నిస్ సింగిల్స్ ఫైనల్‌లో కృష్ణన్ గెలుపు

మద్రాసు, మార్చి 11: మద్రాసు రాష్ట్ర టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను మళ్లీ ఆర్. కృష్ణనే గెల్చుకున్నారు. ఈయన 6-0, 6-3, 6-4 తో ఎస్. విష్ణుమోహన్‌ను ఓడించారు.

స్త్రీల సింగిల్స్ ఫైనల్‌లో మిసెస్ హారిస్ 6-4, 6-1 తో మిస్. పాల్‌పై గెలిచారు.

పురుషుల సింగిల్స్ పోటీ చాలా అలతిగానడచిపోయింది. విష్ణుమోహన్ పొరపాట్లు చేయడంవల్ల కృష్ణన్ గొప్పగా ఆడకపోయినా తేలికగా గెలిచారు. మొదటి 8 గేములూ ఆయనే గెలిచారు. 9-వది మోహన్ గెలిచాక ఆయన నిలిచి పోరాడతారేమో అనుకోబడిందిగాని కృష్ణన్‌దే పైచేయి అయింది.

నేటి పోటీలు ముగిసాక వి. ఎం. రామస్వామి మొదలియార్ బహుమతులు పంచిపెట్టారు. టూర్నమెంటు కార్యదర్శి అహన్ జమ్మాల్ నివేదిక చదివారు.

### ఇఫ్తికార్‌పై ఆర్కిన్‌స్టాల్ గెలుపు

కొలంబో, మార్చి 10: సిలోన్ నేషనల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ సింగిల్స్ పతకాన్ని క్వీన్స్‌లాండ్ ఆటగాడు జె. ఆర్కిన్‌స్టాల్ గెలిచారు. ఆయన 6-3, 6-0, 9-7 తో పాకిస్తాన్ ఆటగాడైన ఇఫ్తికార్ అహ్మద్‌ను ఓడించారు.

స్త్రీల సింగిల్స్ పతకాన్ని మిసెస్ సి. ఆర్. వారెన్, 8-6, 6-0 తో మిస్ రంజనీ జయసూర్యను ఓడించి, గెలిచారు.

### టేబుల్ టెన్నిస్ 3-వ టెస్టు

హైదరాబాద్, మార్చి 10: టేబుల్ టెన్నిస్ 3-వ టెస్టులో హాంకాంగ్ జట్టు (సీసుచు, చుంగ్ చిన్ సింగ్) ఇండియాజట్టు (కె. జయంత్, టి. తిరువేంగడం)ను ఓడించింది. ఇప్పుడు హాంకాంగ్ ఒక ఆట ముందువుంది.

ఫలితాల వివరం: సీసుచు 21-19, 14-21, 21-16, 16-21, 21-12 తో కె జయంత్ నీ, తిరువేంగడం 5-21, 21-16, 17-21, 21-15, 21-14 తో చుంగ్ చిన్ సింగ్ నీ, సింగ్ 21-19, 16-11, 14-21, 21-16, 21-14 తో జయంత్ నీ ఓడించారు చు, సింగ్ 17-21, 21-19, 15-21, 21-19, 21-18 తో జయంత్, తిరువేంగడంలను ఓడించారు.

### ఢిల్లీ క్లాత్‌మిల్స్ హాకీ

న్యూఢిల్లీ, మార్చి 10: సికిందరాబాదు మెంటల్ సెంటరుజట్టు ఢిల్లీ క్లాత్ మిల్స్ హాకీ బహుమతిని గెల్చుకొన్నది. వీరు పంజాబ్ పోలీసుజట్టును 1-0 గోలుతో ఓడించారు.

### ఇంటర్ రైల్వే పోటీలలో సదరన్ రైల్వే అగ్రస్థానం

న్యూఢిల్లీ, మార్చి 10: ఇంటర్ రైల్వే అథ్లెటిక్సు నేడు ముగిసినవి. వీటిలో చాంపియన్‌షిప్ సదరన్ రైల్వేకు లభించింది. ఆరైల్వేకు చెందిన సి. డి. క్లియర్ 'ఉత్తమఆటగాడు' అన్న గణన పొందారు. ఈయన హాప్ స్టెప్ అండ్ జంప్, 400 మీ. హార్డిల్స్ 110 మీ. హార్డిల్స్ పందెములు గెలువడమే కాక రన్నింగ్ బ్రాడ్ జంపులో 22 అ. 8½ అం. పురికి రైల్వేరికార్డు నెలకొల్పారు. 5000 మీ. పరుగు షాట్‌పుట్ లలోకూడా కొత్త రికార్డులు ఈ టూర్నమెంటులో ఏర్పడ్డాయి. సదరన్ రైల్వే 92½ పాయింట్లతో అగ్రస్థానం పొందింది. నార్తరన్ రైల్వే 40½ పాయింట్లతో రెండవస్థానం, ఈస్టరన్ రైల్వే 25½ పాయింట్లతో మూడవ స్థానం పొందాయి. రైల్వేలమంత్రి లాల్ బహదూర్ శాస్త్రి అధ్యక్షత వహించి బహుమతులు పంచిపెట్టారు.

ఫైనల్ పోటీల ఫలితాలు ఈవిధంగా వున్నాయి.

400 మీ. హార్డిల్స్-1. సి. డి. క్లియర్ (స. రై). 2. జె. పి. మూలా (ప. రై.) 3. ఎం. నాగరాజ్ (రైల్వే బోర్డు) టైము 57.6 సె.

1500 మీ-1. లక్ష్మణ్ (స. రై) 2. ప్రేమకుమార్ (స. రై), 3. జి. లక్ష్మణ్, (సెం. రై), 4 ని. 31.4 సె.

100 మీ. 1. భాస్కరన్ (స. రై), 2. విన్సెంట్ మార్టిన్ (స. రై), 3. చరంజీలాల్ (రై. బో.), 11.4 సె.

400 మీ. 1. ముకుంద్‌లాల్ (నా. రై.), 2. రామమూర్తి (ఈ. రై.), 53.81 సె.

త్రోయింగ్ డిస్కస్.1. పారెట్ (ఈ. రై), 2. కె. జె. సింగ్ (నా. రై), ప్రీతంసింగ్ (నా. రై.) 110 అ.

5000 మీ. 1. త్రిలోక్ నాథ్ (నా. రై), 2. ఎన్. వి. బాపయ్య (సెం. రై.), 3. అర్వార్ సింగ్ (నా. రై.). 0.9 సె.

200 మీ. 1. భాస్కరన్ (స. రై.) 2. విన్సెంట్ మార్టిన్ (స. రై.), 3. మహేందర్ ప్రకాశ్ (నా. రై.). 23.1 సె.

110 మీ. హార్డిల్స్. 1. సి. డి. క్లియర్ (స. రై), 2. టి. ఎ. కృష్ణమూర్తి (స. రై.), 3 కె. నాగరాజ (రై. బో.) 15 సె.

హైజంప్ 1. ప్రకాశ్ (స. రై.); 2. వివేకానంద (సం. రై) 3. కె. ఓ. మాల (ద. రై.) 5 అ. 8½ అం.

త్రోయింగ్ ది జావలిన్ 1. ఎ. వాన్ ష్వాబ్ (స. రై.), 2. డి. జె. జే (స. రై.), 3. బచన్‌సింగ్ (ప. రై.) 150 అ. 7½ అం.

4 × 100 మీ. రిలే 1. (స. రై.) 2. ఈ. రై. 3. నా. రై. 45.8 సె.

10,000 మీ. సైకిల్ రేస్ 1 ధన్నా (నా. రై.) 2. సర్దార్ సింగ్ (నా. రై.) 3. పృథ్వీపాల్ సింగ్ (ప. రై.) 17 ని. 19.4 సె.

వెయిట్‌లిఫ్టింగ్ బాంటమ్ వెయిట్ 1. కాళిదాస్ (స. రై.) 535 పౌ. 2. ఎం. తొంభస్వామి (స. రై.) 505 పౌ. 3. కె. ఆర్. శేరీ (సెం. రై.) 490 పౌ.

లైట్ వెయిట్:- 1. బి. కె. బాక్షి (సెం. రై.) 555 పౌ. 2. ఎన్. దాస్ (ఈ. రై.) 530 పౌ. 3. లోకయ్య (స. రై.) 500 పౌ.

మిడిల్ వెయిట్:- 1. ఆర్. ఇ. విం చార్ (ప. రై.) 600 పౌ. 2. కె. ఎస్. మురారీ (సెం. రై.) 510 పౌ. 3. ఎజ్. ఎజ్. పాల్ (ఈ. రై.) 500 పౌ.

లైట్ హెవీవెయిట్:- 1. పాల్ (ఈ. రై.) 650 పౌ. 2. ఎ. ఎన్. వి. హిరణ్ (ప. రై.) 565 పౌ. 3. సుర్బచన్ సింగ్ (నా. రై.) 380 పౌ.

హెవీవెయిట్:- 1. జె. డి. తలాంగ్ (ప. రై.) 620 పౌ. 2. ఎస్. ఘటక్ (ఈ. రై.) 495 పౌ. 3. హెచ్. చెట్టి (సెం. రై.) 450 పౌ.

రైల్వేబోర్డు సభ్యుల జనరల్ మేనేజర్ల హాండీకాప్ రేస్:- 1. కర్నాల్ సింగ్ (నా. రై.) 2. రామానుజం (స. రై.) 3. ముఖర్జీ (చిత్తరంజన్).

### హిమాలయాల అధిరోహణ

ఖాట్మండూ, మార్చి 10: హిమాలయాలను అధిరోహించ తలపెట్టిన బ్రిటిష్ బృందం 13 మందిలో 9 మంది నేడు నామ్చీబజార్‌కు బయలుదేరారు. ఈప్రదేశం 13000 అ. ఎత్తున వుంది. ఇవ్వాళ బయలుదేరిన బృందంతో 162 మంది పోర్టర్లు 18 మంది షెర్పాలు, వారి భార్యలు కూడా వున్నారు. మిగతా నలుగురూ రేపు బయలుదేరుతారు.

### అమీర్ ఇలాహీకి రూ. 10/- వేలు బహూకృతి

కరాచీ మార్చి 10: ఈనగర పౌరుల తరఫున ప్రసిద్ధ బౌలరు అమీర్ ఇలాహీకి రూ 10,000/-లు బహూకరించబడింది. ఎం. ఐ. మర్చెంటు ఇలాహీ బౌలింగ్‌పై పుస్తకాన్ని ప్రశంసించి ఒక బౌలరును గౌరవించడం ప్రపంచంలో ఇదే ప్రథమమన్నారు.

### హైదరాబాద్ జలక్రీడలు

హైదరాబాదు, మార్చి 9: అంతర్ కళాశాల, పాఠశాలా జలక్రీడల పోటీలు నేడు ముగిశాయి. 4 అంశాలలో కొత్తరికార్డులు స్థాపింపబడినాయి.

యూనివర్సిటీ కాలేజీకి చెందిన సత్యనారాయణ 100 మీ. బ్రెస్ట్‌స్ట్రోకు పందెమును 1 ని. 48. 2 సెకన్లలో ముగించాడు. క్రితం సంవత్సరపు రికార్డు 1 ని. 50 సెకన్లు. మహబూబ్ కాలేజికి చెందిన శ్యాంబెంగాల్ 400 మీ. ఫ్రీస్టయిల్ పందెమును 6 ని. 27. 4 సెకన్లలో ముగించి తేసే క్రితం సంవత్సరం ఏర్పాటుచేసిన రికార్డును మించాడు, 200 మీ. బ్రెస్ట్‌స్ట్రోక్ పందెమును సదానంద్ బెంగాల్ 3 ని. 41 సెకన్లలో ముగించి కొత్త రికార్డు ఏర్పాటుచేశాడు. పాత రికార్డు 4 ని. 5 సెకన్లు, మిడిల్ స్కూల్ సెక్షన్లో 100 మీ. ఫ్రీస్టయిల్ పందెమును నూరుద్దీన్ 1 ని. 34 సెకన్లలో ముగించి, తేసే ఇదివరలో ఏర్పాటుచేసిన 1 ని. 48. 4 సెకన్ల రికార్డును మించాడు. హైదరాబాదు పబ్లిక్ స్కూలు మొదటిసారిగా ఈయేడు ఈ పోటీలలో లోల్గొన్నది.

---

# రేడియో

## శుక్రవారం మార్చి 13 వ తేదీ

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥, 7-15 మదరాసు (బి) వలె, 7-30 మద్రాసువలె, 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు, 1 మద్రాసు (బి) వలె, 1-30 మద్రాసు (ఎ) వలె, 1-40 హిందీలో వా॥, 1-50 తెలుగున వా॥, 2 మద్రాసు (బి) వలె, 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు, 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు,

సా॥ 5-30 రామవరపు సుబ్బారావు: వీణ, 5-50 బండ్లమూడి వి. రామనాథశర్మ (గాత్రం) 6-10 స్థానిక ప్రకటనలు, వాతావరణం, 6-15 సంగీత శిక్షణ, 6-30 గ్రామస్థుల కార్యక్రమం, 7 తెలుగున వా॥, 7-15 గ్రామస్థుల కార్యక్రమం: అక్బర్ బాల్యం (బుర్రకథ), 7-30 కులాభిమానము (నాటిక) రచన: ఇచ్ఛాపురపు జగన్నాథరావు; 7-45 ఆర్థిక సదుపాయములు, ప్రజా ప్రభుత్వము (చర్చ) 8 అపురూప కీర్తనలు: నిలయ విద్వాంసుడు; 8-15 షేక్ చిన్నమౌలానా హెబ్ నాదస్వరం 9 ఆంగ్లమున వా॥ 9-15 వాద్య బృందము

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 వ్యాకరణం 7-15 తమిళమున వా॥ 7-30 ఆర్ లక్ష్మి (గాత్రం) 8 ఆంగ్లమున వా॥

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు (తమిళం) 1 మహిళా మండలి (తమిళం) 1-30 గీతమంజరి (బి) 1-40 హిందీలో వా॥ 1-50 గీతమాలిక (బి) 2 తమిళమున వా॥ 2-10 మద్రాసు (బి)వలె 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు (తమిళం) 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు (తమిళం) 4-30 పాశ్చాత్య సంగీతం.

సా॥ 5-30 ఎస్. డి. సుబ్బలక్ష్మి (గాత్రం) 5-45 జానకీ నటరాజన్ వీణ 6 ఆంగ్లమున వా॥ 6-15 పాలఘాట్ సుబ్రహ్మణ్యయ్యర్ (గాత్రం) 7 టి. వి.వసంత(బి) 7-15 తమిళమున వా॥ 7-30 సంధ్యాగానం (బి) 7-45 డి. కె. పట్టమ్మాళ్ (గాత్రం) 9.0 ఆంగ్లమున వా॥ 9-45 కుటీర పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి (ఆంగ్ల ప్రసంగం) 9-30 మద్రాసు (బి) వలె.

### మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వా॥ 7-15 షేక్ నూర్ బదర్సు నాదస్వరం (బి) 7-30 లు మద్రాసు (ఎ) వలె.

మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-0 గీతమాలిక (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 గీతమంజరి (బి) 1-50 తెలుగున వా॥ 2-0 వయొలిన్ నిలయ విద్వాంసుడు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు 4-30 మద్రాసు (ఎ) వలె 6-15 పల్లవం సంజీవరావు వేణువు (బి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7-0 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం అక్బర్ బాల్యం (బుర్రకథ) 7-30 రాష్ట్రాభివృద్ధి కార్యక్రమగరు (కన్నడ ప్రసంగం) 7-45 మద్రాసు (ఎ) వలె 9-30 ఎ. ఐ. ఆర్. వాద్యబృందం 9-50 శాస్త్రీయ సంగీతం (బి).

### హైదరాబాదు

ఉ॥ 7 తెలుగున వార్తలు 7-15 టి. టి. సీత (గాత్రం) 7-45 శైలజామహా బలేశ్వర్‌కర్ భయాల్ లలిత్ 8 ఆంగ్లమున వా॥ 8-15 హిందీలో వా॥ 8-30 రామప్రసాద్ గీత్ 8-40 కైసుల్ అజీజ్ ఘజల్ 8-55 శైలజామహా బలేశ్వర్‌కర్.

మ॥ 12-30 భక్తిరస (బి) 12-50 మరాఠీలో, వార్తలు 1 వాద్యసంగీతం (బి) 1-10 వయొలిన్ (బి) 1-20 డి. కె. పట్టమ్మాళ్ (బి) 1-40 వేణువు (బి) 1-50 తెలుగున వార్తలు.

సా॥ 6-30 మరాఠీలో కార్యక్రమం 6 రామ్‌ప్రసాద్ గీత్ స్థానిక ప్రకటనలు 6-15 గ్రామసీమ 7 తెలుగున వా॥ 7-15 కైసుల్ అజీజ్ ఘజల్ 7-25 శైలజామహాబలేశ్వర్‌కర్ ఖయాల్ ఛాయాచాట్ 7-45 కన్నడమున వా॥ 8 ఉర్దూలో వా॥ 8-15 విశ్వవిద్యాలయాల కార్యక్రమం (ఆంగ్లం) 8-30 వీరకోరిక పాటలు 9 ఆంగ్లమున వా॥ 9-15 ప్రతిక్రియ (నాటిక) రచన ఘట్టి అంజనేయశర్మ 9-45 టి. టి.









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.